ఇరువదియాఱవ పూజాపుష్పము

# కన్నీటి పువ్వులు

## (లలిత గీతాలు)




రచన:

పి. దుర్గారావు, యం.ఓ.యల్.

# వినయ వాక్యము

'కన్నీటి పువ్వులు' అను ఈ పుస్తకమును మధుర భక్తి లలితగీతాలను ఇరువది యారవ పూజాపుష్పముగా తెలుగు సాహితీ సరస్వతి శ్రీచరణాలకు భక్తితో సమర్పించు కొనుచున్నాను. ఉపాధ్యాయవృత్తిని నిర్వహించుకొనుచు అప్పుడపుడు వ్రాసికొనినవి యీ గీతములు. మధురభక్తిని మనోహరముగా వ్రాసికొనిన కీ. శే. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి మధురగీతములే నా యీ లలితగీతములకు ప్రేరణ యని చెప్పవచ్చును.

ఇదివరలో ప్రచురించిన కృష్ణభక్తి గీతములను ప్రశంసించుచు, ప్రముఖులు వ్రాసి యున్నారు. వారికి నా నమస్సుమాంజలులు!

ఈ పుస్తకమునందు గల గీతములు సాధ్యమైనంత వరకు పాడుకొనుటకు వీలుగా లలిత పదములలో గుది గ్రుచ్చబడినవి. రసహృదయులను ఏమాత్రము స్పందింప జేసినను ధన్యనిగా భావించుకొందును.

—రచయిత.

ప్రథమ ముద్రణము - 400 ప్రతులు.

ప్రమోదూత నామ సంవత్సరము
హేమంతము - మార్గశీర్షము
డిసెంబరు - 1-90.



ముఖచిత్రము : రాజ్ మహేందర్.

**వెల : 8-00**

ముద్రణము ;
"వెంకటరత్నా" - గవర్నరుపేట, విజయవాడ-2

ప్రతులకు ;
పి. దుర్గారావు, యం.ఓ.యల్.
చెరుకుపల్లి పోస్టు, (వయా) నక్రేకల్,
కేతేపల్లి మండలం, నల్లగొండ జిల్లా.

# సమర్పణ

కృష్ణా!

ఎన్నిమార్లు పాడినా గూడా
వన్నె తరుగదు గదా నీ పాటకు!
ఎన్నిమార్లు విన్నా నీ మురళిని
చిన్నె లేమీ తరుగవుగదా!

మఱచిపోవాలన్నా మాధవా!
మఱపు రాదు! నీ గీతము!
విడిచిపోవాలన్నా విడిచిపోదు!
విరహ మిది యేనాటి బంధమో కదా.

కంటిపాపలా కన్నులలో నటిస్తుంది!
కమ్మని ధ్వనులతో కలవరం కలిగిస్తుంది!
నీడవలె నన్ను వెన్నంటివస్తుంది!
నిలువనీదు క్షణం!
నీ పాట నిను దలచకుండా!

అందుకే అర్పిస్తున్నా!
ఆత్మార్పణ మంటూ వేదనా కుసుమాలు!
కన్నీటి పువ్వులు!
యుగయుగాలనాటి దీ కన్నీరు!
తరతరాల నాటి వీ పువ్వులు!



# కన్నీటి పువ్వులు
## (లలిత గీతాలు)

వెయ్యాయిలు బలుకలేను!
వివరించుచు నా కోరిక!
'స్వామీ!' యని తెలుపుచుంటి!
సరసముగా మనసు మాట!
వెయ్యాయిలు బలుకలేను!
వివరించుచు నా కోరిక!

మధుర గీతి స్వర లయలను
మంజులమగు పదములలో
తీరుగ నే దెలుపుచుంటి
తీయని నా మనసు కోర్కె!

భక్తి, రక్తి దయసేయుము
చిత్తము నిను చేరునటుల!
మాధవ! యని నిను నిరతము
మధురముగా బిలువనిమ్ము!

కనులముందు నిలిచి కృష్ణ!
కమ్మని మురళీ రవములు!
వినిపింపుము! నంతె చాలు!
వేడను మరి యే వరమును!

కన్నీరిదె పూవులుగా
కడలసాగె గిరి సోనగ!
నీ పదముల గడుగనిమ్ము!
చిందారిన భక్తి తెరల!

## తెలిమబ్బుల తేలిపోవు

తెలిమబ్బుల తేలిపోవు
తెల్లని యీ యంచబారు!
గోవిందుని కడకు బోవు
గోపకాంత లగుసేమో!
తెలిమబ్బుల తేలిపోవు
తెల్లని యీ యంచబారు!

హేమంతపు ఋతువునందు
హిమధారల జలకమాడి!
స్వామి ద్వారమందు జేర
తరలు గోప కాంత లేమొ!

వ్రతము చేయు కాంత లేమొ!
వన్నె చిన్నె లేమి లేవు!
సుందరమగు పూ దండగ
సొంపుమీర కదులుచుండె!

గోప వనితలార! పొండు!
గోవిందుని దర్శింపుడు!
వ్రతఫలితము నంది పొంది
వాంఛ యేమొ! దీర్చికొనుడు!

పుణ్యఫలము లేదుగదా!
పూని యెటుల మిము జేరుదు?
నా వార్తను నాథునితో
నయముమీర దెలుపుడమ్మ!

## నింగి నీలి మేఘము గని

నింగి నీలి మేఘము గని
నీవె యనుచు మది దలంతు!
        మాధవ! యని పిలుచుచు నే
        మధుర సుధల దేలిపోదు!
నింగి నీలి మేఘము గని
నీవె యనుచు మది దలంతు!

మెరుపులలో కాంతు లొలికి
మేదిని దివి వ్యాపింపగ!
తీయని నీ ప్రేమ చిలికి
తేలిన వెలుగని దలంతు!

దూరముగా పిట్టల చిటులు
ఘూర్ణితమగు నాదముల గని!
రాసక్రీడ పలుపు నీదు
రవళి యేమొ యని భ్రమింతు!

నింగి వర్ష ధారలచే
పొంగిన సరసుల గనుగొని!
నీ ప్రేమామృత ధారల
నిండినవని యూహింతును!

'నాథ!' యనుచు బిలుచు నన్ను
నవనీతము సేయ వేమి।
చిన్ని మావు చిలకరించి
చిరునవ్వును జిందవేమి।

## తుమ్మెద! యిక పాడకుమా!

తుమ్మెద! యిక పాడకుమా!
తూలి నాట్య మాడకుమా!
నందుని యీ ముద్దులాడు
నా మనసున నాట్యమాడు!
తుమ్మెద! యిక పాడకుమా!
తూలి నాట్య మాడకుమా!

పిలిచిన నా పిలుపులన్న
వెలవెల బారిన వన్ని
వేడిన నా వినతులన్న
వికసించని పూవు లాయె!

నా మదిలో ప్రేమగీతి
నాట్య మాడుచే గాని!
కరుగదాయె స్వామి మనసు
కాంక్ష దీర్ప రాడుగదా!

నీవుగూడ నాథు రీతి
నిర్దయురాలివి గదవే!
ఆట పాట యరనిముసము
ఆపవుగా సద్దు మణగి!

గుండెలలో సంద్రముగా
నిండు తెరల రేపకుమా!
మనసునందు పూ బాణము
మర్మముగా నాటకుమా!

## మధుర మధుర భావములను

మధుర మధుర భావములను
మనసు దోలకనిమ్ము కృష్ణ !
ఉదయసంధ్య మొలకలవలె
సదయ! కాంతి వెలుగనిమ్ము!
మధుర మధుర భావములను
మనసు దోలకనిమ్ము కృష్ణ!

హిమబిందువు లలముకొనిన
హేమంతవు సొగసుల వలె!
నీ యనంత రూపములను
నే దలచుచు మురియనిమ్ము !

చందమామ కిరణములటు
చయ్యన నా మదిని బొంగి!
భువి నింగిని యల్లుకొనిన
పూర్ణములో గలియనిమ్ము!

నీ యనంత విమల జ్యోతి
నే నొక రేఖను గాదా!
నీ యఖండ రూపములో
నే నొక యణువును గాదా!

కలిపికొనక నిలిపికొనక
కసరుట యిది న్యాయమా॥
కనికరించి యెందటినో
కావలేదని చిన్ని కృష్ణ!

## ఝల్లున నా కాలి యందె

ఝల్లున నా కాలియందె
గలగల మ్రోగునదేలా?
తీయగ నా కంఠ గీతి
తేనెలు పొంగునదేలా?
ఝల్లున నా కాలియందె
గలగల మ్రోగునదేలా?

కొండలలో కోనలలో
కోకిల పాడిన రీతిని!
మురళి స్వనము వినిపించును
మోహములో మునిగిపోదు!

కనిపించని మాధవుండు
కనులముందు నిలిచినటుల!
వినిపించని వేణు రవళి
వినినటులుగ యనిపించును!

పిలిచినటుల పలికినటుల
ప్రేమమీఱ పాడినటుల
సుందరమగు నావపైని
సుధల దేలిపోయినటుల!

ఇది కలయో! ఇది భ్రమయో!
ఇది సత్యమొ! చెలియ చెపుమ!
కట్టిన యీ మూడు ముడులు!
పెట్టిన కుంకుమ లివిగో!

## వికసించిన కలువలాగు

వికసించిన కలువలాగు
విప్పారిన నా మనసును
అతనికి! అతనికి! నే నా
హరికే యర్పించితినీ!
వికసించిన కలువలాగు
విప్పారిన నా మనసును!

అన్నిటికీ నీవే యని
విన్నపమును జేసితినీ!
అంజలినీ ఘటియించీ
ఆత్మార్పణ మర్పించితి!

నా గీతిని పూ మాలగ
నాథ! యనుచు కీర్తించితి!
హరి సన్నిధి జేరగదా
యుందితి నీ గాన సుధను!

సుందరమగు సుస్వరముల
అందమైన యీ గీతము!
పండిన దానిమ్మ ఫలము
పద్మజ హృదయేశ్వరునికి!

కనులయందు చిలికి చిలికి
కరుణారస భరితమైన!
కన్నీటిని పువ్వులుగా
కానుకగా నర్పించితి!

కాల దినము లివే!

శరత్కాల దినము లివే!
చారు చంద్ర జ్యోత్స్న లివే!
దివీ భువీ తెలుపులతో
దిశ లన్నీ కాంతు లమరె!
శరత్కాల దినము లివే!
చారు చంద్ర జ్యోత్స్న లివే!

కలువ కమల భామలతో
కొలకు లన్నీ నిండారెను!
నిర్మలమగు నీటి తెరల
నీడలు కనిపింపసాగె!

నీటిపక్షు లలల తెరల
నీడల క్రీడింప సాగె!
రాగ సుధలు మెల మెల్లగ
గాన సుధల చిలుకసాగె!

వేణుగాన లోలున కిది
వివరముగా దెలుప వలెన?
అఖిలము పులకింపజేయు
అతని ప్రేమ నను జేరద?

ఈ వెన్నెల రాత్రులలో
ఈమాత్రము నోచుకొనన?
తీయని మురళీ స్వనముల
తీపి తెరల మునిగిపోన?

## చిగురులార! పువ్వులార!

చిగురులార! పువ్వులార!
చిత్రమైన తీగెలార!
మాధవు నే వెదుకుచుంటి!
మమత దెలుపు డమ్మలార!
చిగురులార! పువ్వులార!
చిత్రమైన తీగెలార

పూ పొదలను దాగినాడొ!
పువ్వు నాటి నిలిచినాడొ!
మురళి నూదుచున్నవాడొ
మోహనముగ యమున దరివి!

మురళిస్వనము లోకటోకటిగ
మోదముగా వినిపించును!
మనసు 'మాధవా!' యనుచును
మారు మ్రోగుచుండు నెపుడు!

మనసు వ్యధను నిలుపలేను।
మధురభావ మాపలేను!
కనిపించిన మాధవుండు
కరుణ బలుకు డమ్మలార!

అతనికోఅకు వెదికి వెదికి
అలసి సొలసి పోతినమ్మ!
వినిపించును మురళి! కాని
కనిపింప డదెందుఁకో!

## ౯ నా యీ గీతికి

పాడిన నా యీ గీతికి
పల్లవి యెపుడాగు కృష్ణ !
　　　వినీ వినీ నీ మనసును
　　　విన్నప మెపు డతుకునో!
పాడే నా యీ గీతికి
పల్లవి యెపుడాగు కృష్ణ !

కదలి పొంగినటుల నీదు
కరుణ యెపుడు గలుగునో !
కనికరమున జేరదీసి
కమ్మని దీవన నిచ్చెదో!

మనసుపొంగి పూలుపూచి
మధురవీచి తెరలు సాగు?
మనసు వీణ మధురగీతి
మర్మముగా ధ్వనియించునో?

సుందరమగు నా నావను
సుడులనుండి దరిని జేర్చి !
తీయని నా తీపి కలను
తీర్చి నిజము సేయుదువో?
మరుజన్మము లేకుండగ
మధురిమలను గలుపవోయి !

## అంత కోప మేల స్వామి?

అంత కోప మేల స్వామి?
అంత తాప మేల స్వామి?
మంగళమగు నీదు జ్యోతి
మధుర కిరణమును గాదా!
అంత కోప మేల స్వామి?
అంత తాప మేల స్వామి?

వేఱయితిని నిన్ను విడిచి
వింత దారులను బోతిని!
కర్మ బంధముల దొరలుచు
కాల మెంతో గడిచి పోయె!

మఱల నిన్ను గలియుటకయి
మలుపు లెన్నొ దిరుగుచుంటి!
నీ నామము గీతముగా
నిత్యము నే బాడుచుంటి!

చీకటి తెరలను దాటి
చిర శాంతిని బొందునటుల!
మరుజన్మము లేకుండగ
మాధవ! దయసేయవోయి!

నీ మురళీ స్వనములలో
నిండుగ నను గలుపవోయి!
కర్మబంధముల దొలచి
శాంతి రేఖ గలుపవోయి!

## రులలో! పూవులలో!

చివురులలో! పూవులలో!
చిత్రమైన పొదలయందు!
హరిని వెదకు చుంటి చెలియ!
ఆతనిలో లీనమవగ!
చివురులలో! పూవులలో!
చిత్రమైన పొదలయందు!

కొండ కోన లడవులలో
కోయిలపాడే చోటుల!
బాలకృష్ణు డుండు ననీ
పరితాపము నొందుచుంటి!

నింగి నీలి మబ్బులలో
నీటు గులుకు తారలలో!
హారిపిల్లున యతని జాడ
వరయుచుంటి వేదనతో!

ఔను! నేను వెదకు చుంటి!
ఆకసమున భూమిపంత!
శాంతి లేదు! లేదు చెలియ!
కాంతునిలో గలియుదాక!

కాలి నడక యాగిపోదు!
కన్నీరును ఆగిపోదు!
కలత మనసు శాంతింపదు!
కాంతుడు కరుణించుదాక!

## తీయని నీ మధుర గీతి

తీయని నీ మధుర గీతి
తీరుగ నను పాడనిమ్మా!
అలసి సొలసి పోనిమ్మా!
అలరి తూలనిమ్మా కృష్ణ!
తీయని నీ మధుర గీతి
తీరుగ నను పాడనిమ్మా!

సుందరమగు నీ రూపము
సురుచిరముగ నా కనులను
చూచి చూచి ఐక్యములయి
సొబగులలో కలియనిమ్మా!

కోటి కోటి నామములను
కోమలముగ పలుకనిమ్మా!
క్రొత్త క్రొత్త గీతములను
కోకిల వలె పాడనిమ్మా!

మనసుమాట వినుము స్వామి!
మర్మముగా మధురముగా
పక్షి వలే పలుకనిమ్మా!
భ్రమరములా పాడనిమ్మా!
నిత్యము నీ మధుర గీతి
నిలువనిమ్మా నా గొంతున!
నీ రూపము నా కన్నుల
నిలువనిమ్మా! తెరలు వడక!

## పాటలోని పదములకూ

పాటలోని పదములకూ
భావమేమొ తెలియకృష్ణ!
మనసుపడే వేదనలకు
మర్మమేమొ తెలియుగదా!
పాటలోని పదములకూ
భావమేమొ తెలియకృష్ణ!

కనులనీరు ప్రవహించుట
కారణమది తెలియు నీకు!
మధురగీతి వేదనలో
మర్మమేమొ తెలియుగదా!

మనసు మూగి కాదు గదా!
మౌన మూన నెందుకనో!
నీ నామము నా మనసున
నిలువరింప నెందుకనో!

చిన్ని మనసు నిటుల నీవు
చిత్రవధలు సేయదగునె?
నీవులేని నా జీవము
నిలువదనీ తెలియుగదా!
మధుర మురళి రవములలో
మాధవ నను గలిపి కొనుము!

## అంతరంగమందు నిలిచి

అంతరంగమందు నిలిచి
ఆత్మసఖుడవైన నిన్ను
కనులకు గనిపింపు మనుచు
కాంక్ష సేయ తగునా యిటు?

అంతరంగమందు నిలిచి
ఆత్మ సఖుడవైన నిన్ను!

మనసునందు మధుర మురళి
మర్మముగా మ్రోగుచుండ!
తీరుగ వినరాలేదని
తెలువు కెంత తప్పిదమో!

విశ్వమంత నీ రూపము
విమలముగా దోచుచుండ!
'నందగోప తనయా!' యనుచు
నాథ! యిటుల బిలువదగున?

కనిపించునదంత నీవె!
కారణ మంతయు నీవే!
లోబయలును నిండియున్న
లోల! నిన్ను వెదకుచుంటి!
వెలుగునందు వెలుగు జేర్చి
వేగ శాంతి నిమ్ము స్వామి!

## మురళిస్వనము వింటిమనుచు

మురళి స్వనము వింటి మనుచు
మోదముతో తెలుపుడమ్మ!
హరి రాకను తెలియజేసి
ఆత్మ సుఖము గలిగింపుడు!
మురళి స్వనము వింటిమనుచు
మోదముతో తెలుపుడమ్మ!

మబ్బు కన్నెలార! వినుడు!
మల్లెపూల తీగెలార!
నందగోప తనయుడంచు
నను మోదము దేల్పుడమ్మ!

చుక్కలార! రిక్కలార!
సుందరమగు హంసలార!
పరువెత్తే మృగము లార!
పాటింపుడు నా మాటను!

హరి రాకకు నెదురు చూచు!
అతివను! నే హరిదాసిని!
'హరి' యెడుగో! యని పలుకుడు!
అలరుదు నానంద సుధల!

హరివిల్లుగ మారిపోదు!
అంబరమున తేలిపోదు!
అణిగిపోదు! మణిగిపోదు!
అతని దివ్య కాంతులలో!

## తెలిమబ్బా! తేలిపోకు!

తెలిమబ్బా! తేలిపోకు!
తీరని నా వేదన విను!
నా నాథుని కడకు బోయి
నా వార్తను వినిపింపుము!
తెలిమబ్బా! తేలిపోకు!
తీరని నా వేదన విను!

యమునా నది దరిని వారిని
అలరి వేడ్క దరిశింపుము!
కరుణమీర వినిపింపుము
కాంతుకు నా దీన గాథ!

పవలు రాత్రి నిను దలచుచు
వందువారి వోయినదను
చిక్కి శల్యమైన దనుము!
చివటి దినములని దెలుపుము!

మరచిపోయెనేమొ స్వామి
మమత యెటుల యుండును మఱి
గుఱు తిదిగో! ఉంగరమును
గొనిపొమ్మా! నాథు కడకు!
మనసు జాలి గలుగునటుల!
మమత పొంగి పొరలు నటుల!
కథ నంతా తెలియజేసి
కరుణ గలుగు నటుల జేయి!

## భువి సుఖముల దివి కాంక్షల

భువి సుఖముల దివి కాంక్షల
పొలుపుల నే గోరలేదు!
మధురమైన నీదు ప్రేమ
మాధుర్యము గోరుచుంటి!
భువి సుఖముల దివి కాంక్షల
పొలుపుల నే గోరలేదు!

పూలతీవె లల్లుకొనిన
పొన్నతరుల నీడలలో!
నినుపాడుచు నర్తించుచు
నీదు మురళి జేరాలని!

అంతా నీవే యనుచును
అన్నింటిని నిను దలచుచు!
విశ్వమంత నిను జూచెడి
విమల శాంతి పొందాలని!

కోకిల పాడే రీతిని
కొసరుచు నిను పాడాలని!
కొలని కలువ తామరలను
గూడి తపసు జేయాలని!

తరతరాల నాటి దనీ
తరగని దీ ప్రేమ యనీ!
మనసారగ నిను పాడుచు
మణిగిపోవ నా కోరిక!

## మనసులోని భావములను

మనసులోని భావములను
మాపివేయబోకు స్వామి!
మధుర గీతములను నోట
మాధుర్యము నొలకనిమ్మా!
మనసులోని భావములను
మాపివేయబోకు స్వామి!

విదియనాటి చంద్రలేఖ
విమలముగా దొలకనిమ్మా!
మబ్బులలో మాయజేసి
మాధుర్యము మాపకోయి!

చివురాకులు పూలు విరియు
చిత్రమైన పూలతీవె!
పెనుగాలుల ముంచకోయి!
ప్రేమ కొంత చూపవోయి!

విరిసిన మది ప్రేమగీతి
వేడుక నిను జేరనిమ్మా!
నీ మురళీ స్వనములలో
నే తన్మయ మందనిమ్మా!

ఆనందపు జలధియందు
అంతరింప నా కోరిక!
జ్యోతి జ్యోతియందు కలిసి
శాంతి నొందు చిరకాంక్షా!

## పాట పాడమని పలవరించెదవు

పాట పాడమని పలవరించెదవు
భావము లెటగొని వత్తునురా! కన్న!

మెత్తని పదముల తీయగ నేటువలె
చిత్తము మోదము గూర్తునురా! కన్న!

పాట పాడమని పలవరించెదవు
భావము లెటగొని వత్తునురా! కన్న!

పాడి పాడి నా మనసు తెల్లనై
పాలరాతిగా మారెనురా!
గానము జేయుచు గమ్మున యోగిన
కలికి తుమ్మెదగ మారెనురా!

మధుర వసంతము కోకిల రాగము
మాధురి చిందే దొక ఋతువేగా।
ఆఱు ఋతువులను కలరి పాడుమన
అందమురా! యిది గోపాలా!

అంత మోదమా? అంత సంతసమ?
అలరెద వెందుకు నా పాటలకూ?
మధురమైన నీ మురళీ స్వనముల
మాధుర్యముకంటే మంజులమా?

పాడ పాడమని పలవరించెదవు
భావము లెటగొని వత్తునురా! కృష్ణ!

## నాలో నువ్వు నీలో నే

నాలో నువ్వు నీలో నే
నయముగ యున్నాము గదా!
　　తరతరాలు యుగ యుగాలు
　　తరలిపోవుచున్నవిగా!
నాలో నువ్వు నీలో నే
నయముగ యున్నాను గదా!

తొలి సంధ్యల తోరణమున
తూలు అరుణ రేఖ వోలె!
నీతో నే నుంటి గదా!
నిఖిలేశ్వర! నిజముగాద!

పూవుగ నే పరిమళించి
పుడమి రాలిపోవుచుంటి!
నీ పదముల నంది పొంది
నిర్మలమై పోవుదునా?
చీటలు వారిన మదిలో
చిల చిలమను జలలెపుడో!
మనసారగ నను మెచ్చుచు
మన్నన సేయుట యెపుడో!
తీయని మురళీ స్వనముల
తీరుగ నే కలియుటెపుడో!
నీ పాటను నా పల్లవి
నిండుగ కలియుట యెపుడో!

## మధువసంత ఋతువులోని

మధువసంత ఋతువులోని
మాధుర్యము నాపకోయి!
తీయని కోకిల పాటల
తేనె నటులె పోరల నిమ్మా!
మధువసంత ఋతువులోని
మాధుర్యము నాపకోయి!

రంగు రంగు పుష్పోదులను
రమణీయపు వన వీధుల!
ఇంద్రధనుసు సొంపులనూ
ఇంపు గులుక మెఱయనిమ్మా!

నా మనసున యతికిన నీ
నవ్యరూప చిత్రపటము!
చెరిగిపోక చెదిరిపోక
చిరకాలము నిలువనిమ్మా!

నా గళమున నీ గీతిని
నవ్యమధుర పదములతో
సెలయేరుగ జలజలమని
చిత్రగతిగ జారనిమ్మా!

మధురముగా నీ ప్రేమల
మాధుర్యము చిందుదాక!
నా మనసున రసధునులను
నాట్యమాడనిమ్మా కృష్ణ!

# పండుటాకులన్ని ధరను

పండుటాకు లన్ని ధరను
పడిరాలిన వందువేమొ!

కాదోయీ మధురాక్షర
కమ్మని లేఖలు గాదా!

పండుటాకు లన్ని ధరను
పడిరాలిన వందువేమొ!

తూలుచు తుమ్మెదలు జేయు
తోరపు నాట్యములు గావు!
నా రొద పువ్వులను జేరి
నాదముతో దెలుపుచుండె!

తీయని తెరలను గట్టె
తెలి మబ్బులు నిలువ వనియు?
నా సందేశము జేకొని
వచ్చుచుండె నీ తావులకు!

నిముసమైన శాంతిలేదు
నీరధివలె యలల తెరల!
అవని యంబరములు జూతు
ఆశింతును నీదు రాక!
తలుపు దీసి చూచుచుంటి!
తగ దర్శన మీరాదా!

## నింగి నీలి యంచులందు

నింగి నీలి యంచులందు
నిలిచిన బంగారు తీగ!
నీ కొరకే నే దెచ్చితి
నీరజాక్ష! యందుకొనుము!
నింగినీలి యంచులందు
నిలిచిన బంగారు తీగ!

వెన్నెల చివురులను దెచ్చి
వేడ్క పాలరాతి నూరి!
మిస మిసలను బూజింపగ
మీటుచుంటి మధురవీణ!

ఇంద్ర ధనుసు రంగులన్ని
ఇంపుగ యరిటాకు జేర్చి!
నీదు చిత్రపటము వ్రాయ
నిర్మలముగ గూరుచుంటి!

పాలుపోసి నీరుపోసి
పరగ పెంచితిని తరువును!
తీయని యా ఫలములంది
దివ్యసుఖము లందుదునా!

మనసులోని కోర్కె దీర
మాధవ! నను జేరుదునా?
నా గీతిని కనికరించి
నను మన్నన సేయుదువా?

## చిమ్మచీకటులను మాపి

చిమ్మ చీకటులనుమాపి
చిఱు సంధ్యల వెలుగనిమ్మ!
శూన్యమైన నా మదిలో
సురచిర కాంతిని నింపుము !
చిమ్మ చీకటులను మాపి
చిఱు సంధ్యల వెలుగనిమ్మ!

పండుటాకులన్ని రాలి
పడి వాడిన పూలవాటి!
నవవసంత శోభలతో
నాథ! మఱల వెలుగజేయి!

రక్ష నీవె యనుచు బలికి
పక్షి వోలె నెగురుచుంటి!
విశ్వమంత దిరుగుచు నీ
విమలగీతి బాడ నిమ్మ!

నీలి మబ్బులంచు లందు
నింగినీలి తళుకులందు!
గ్రహతారల కాంతులందు
కలిసిపోదు నొక్కటియై!

నీడ నేను; వెలుగు నీవు
నిలిపికొనుము కాంతియందు!
తర తరాల విరహగీతి
తరలి శాంతి నొందు నటుల!

## మలయ పవన గాంచితివా ?

మలయపవన! గాంచితివా ?
మాధవుడుండే జాడను?
    పొన్నలార! పొగడలార!
    పూర్ణపురుషు జూచితిరా?
మలయ పవన! గాంచితివా?
మాధవుడుండే జాడను?

నింగి మెఱయు చుక్కలార!
నీరజాక్షు జూచితిరా?
కరుణ బ్రోచు వన్నెలాడె!
కంటిరేమొ తెలుపుడమ్మ!

చిలకలార! కోయిలలార!
చిన్ని పాలపిట్టలార!
మధుర మురళి నూదువాని
మాధవు నిట జూచితిరా?

పుడమి తల్లి! నీ వయినను
పురుషోత్తము జూచితివా?
జ్యోతి రూపుడనుచు బలికి
జోహారులు సేయుదురా!

మనసునందు దాగి నన్ను
మాయలేల జేసెదవో!
తిన్నగ నను జేరవోయి!
తీర్చుకొందు కన్నులలో!

## హృదయ మనే పూ దీవెను

హృదయ మనే పూదీవెను
కదిలిన యీ పరిమళమును
వన వీధిని ప్రాకి ప్రాకి
నిను జేరగ నిమ్ము కృష్ణ!
హృదయ మనే పూదీవెను
కదిలిన యీ పరిమళమును!

తీయని నా పాల మనసు
తేనియ భావముల గూర్చి!
మంజులమగు పదములతో
మధురగీతి బాడనిమ్ము!

వెన్నెల సొగసుల దేలుచు
వేడుక కిన్నెరను బట్టి!
పాడిన నాగాన సుధలు
ప్రవహింపగ నిమ్ము కృష్ణ
నా గొంతున వెడలినట్టి
నవ్యమైన మధురగీతి!
శాంతి తెరల కలిసి మెలసి
శాంతియాత్ర జేయనిమ్ము
మది పులకలు నింపెదవో!
మనసు జ్వాల జేసెదవో!
జ్యోతి జ్యోతి గలిపికొన్ని
ప్రీతి శాంతి గూర్చవోయి!

## వేరు చేయనేల కృష్ణ!

వేరు చేయనేల కృష్ణ!
వేదనలను ముంచుటేల?
మనసు నందు కలకలమును
మాధవ! యిటు చేయదగునె?
వేరు చేయనేల కృష్ణ!
వేదనలను ముంచుటేల?

సప్తపర్ణి దరికి జేరి
పరవశ మది పొంగి పొరల!
'హరి యెచ'టని యడిగిన తా
నబ్బురమున పెదవి విరచె!

నూగాకుల పూలతీవె
'నోములు ఫలియించెనె?' యనె!
'పూలన్నియు నతని కొఱకె!
పొగులుచుంటి!' ననుచు బలికె!

కోటి కోటి యాకులు గల
పూచిన యా మావి తరువు!
'గల గల' మనె, 'నా రోదన
గనలేవా?' యనుచు బలికె!

ఇంత కలత గలుగజేసి
అంత వెతను జేసిన నిను!
సుంత మనసు నొచ్చికొనదు!
'అంతరంగ!' యనుచు బలుకు!

## యుగ యుగాల దీ పాటా!

యుగ యుగాల దీ పాటా!
జగ జగాల దీ బాటా!
ఆగిపోని యలసి పోని
అంతులేని దీ యాత్రా!
యుగ యుగాల దీ పాటా!
జగ జగాల దీ బాటా!

మీటుచు మీటుచు కిన్నెర
చిటిలిపోవ తీవలన్న!
మఱల క్రొత్త వీణ దెచ్చి
మర్మముగా నిత్తువేల?
వాసంతము శిశిరముతో
వన్నెలన్ని తరిగిపోవ!
మరల చిగురు పూవులతో
మధురిమలను గూర్తువేల?

అరుణోదయ కాంతులన్ని
యస్తాద్రిని జేరిపోవ!
సుఖద శుభద సూర్యోదయ
సుందరముల గూర్తువేల?

పాడిన పాటను మరలను పాడలేను జగదీశ్వర!
ఆడిన యాటను మరలను యాడలేను యఖిలేశ్వర!
మరుజన్మము లేకుండగ మాధురిమలను గలుపు స్వామి
తీయని నీ స్వనములలో దీర్ఘ శాంతి నొందునటుల!

## నీ మురళికి సాటియైన ।

నీ మురళికి సాటియైన
నిండారిన గీత మొకటి!

నా గొంతున మ్రోగాలి!
నవ్యసుధలు పొంగారగ!

నీ మురళికి సాటియైన
నిండారిన గీత మొకటి!

నా గళమున నవ్యగీతి
నవ భావము తోడ తొణికి!
భువి యాకాశములనంత
పొలువుల జిందింపాలి!

సప్తస్వరములను బలికి
సకల దిశలు జాలు వారి!
భక్తిస్నేహ భావములకు
పరవశమును జేయాలి!

అపుడుగాని నా మొఱలను
ఆలకింప వేమొ స్వామి!
అట్టిగీత మొకటి బాడ
యాశించెద రోజు! రోజు!
కరుణజూపి కనికరించి
కామితమును దయసేయుము!

## మధుర వసంతం వచ్చింది!

(వచన కవిత)

మధుర వసంతం వచ్చింది!
మావికొమ్మలూ పూచినవీ!
పాడనీ స్వామి కోకిలనూ!
పంచమ స్వరంలో మధురంగా!

మనసులోని పలు నాద ధ్వనులను
మంజుల స్వరాలు పలుకనీ!
నాదం చేస్తూ ఉవ్వెత్తున నీ
నవ్య తరంగాలను లేవనీ!

పూచిన పువ్వుల్లాగున కదిలీ
విరిసిన వెన్నెల్లాగున తొలికీ!
మదిలోపలి తీయని తీయని
మధుర భావాలు తొలకనీ!

మధుర భావాల దొంతర నుండీ
మనోహరమా ఒక రాగంలో!
తీయగ ఒక పాటరానీ స్వామీ!
తీరుగ యీ మధుర వసంతంలో!

మధుర వసంతం వచ్చింది!
మావికొమ్మలూ పూచినవీ!

## నీ పాట నా కెందుకోయీ! కృష్ణా!

నీ పాట నా కెందుకోయీ! కృష్ణా!
నీ మురళి వినను పోవోయీ!
చుక్కలవలె దూరాన సొగసుజూపి నిన్ను
వంక జూడను! ప్రీతి వరుస బిలువను సుమ్మీ!
నీ పాట నా కెందుకోయీ! కృష్ణా!
నీ మురళి వినను పోవోయీ!

నన్ను మఱచిన నిన్ను
నాథ! యని బిలువనూ!
కాంత లందఱి ముందు
కయ్యమాడద స్వామి!

అందుకోమని బిలువ
విడుకోమని బిలువ!
నా మధుర గీతితో
నాట్యాలు సలుపనిక!

నా గళము తెలువడిన
నా గీతి వినవు గద!
పాటలో భావమును
పరికింప బోవుగద!

నీ మురళి స్వనములకు
నే మోనపోనోయి!
నా వేదనలను వినీ
నను బ్రోచు నందాక!

## వర్ష ధార మునిగి నటుల!

వర్ష ధార మునిగి నటుల
వార్ధియలల దేలినటుల!
నీ ప్రేమామృత ధారల
నిలువనీర! చిన్నికృష్ణ!
వర్ష ధార మునిగి నటుల
వార్ధియలల దేలి నటుల!

రాలిన కన్నీటి పూలు
రవరవలను దొరలు చుండె!
పాడిన నా పాటలనే
ప్రతి నాదము సేయుచుండె!

పిలిచిన నా పిలువులన్ని
చెలగి వేడి నిట్టూర్పులు!
మబ్బు తెరల వలె మాధవ!
మారెనదిగో! గగనవీధి!

నీట ముంపు! పాల ముంపు!
నీవే దిక్కని యంటిని!
భారము నీదే కదరా!
బ్రతుకు తెరువు నీవె స్వామి!
మనసు దోచి మాయజేసి!
మమతనేల జూపవురా?
వెన్నెల- వెనుచీకటి వత
వేయుమింక నీవె దిక్కు!

## నా మనసులో నున్న!

నా మనసులో నున్న నా బొమ్మ నీవెగా!
ఆడుకోనీ! యలరి పాడు కోనీరా!

మురళి నాదమటంచు
ముద్దుగా బలుకనీ!
వెన్న దొంగా! యనుచు
వేడుకను బాడనీ!

నా మనసులోనున్న నా బొమ్మ నీవెగా!
ఆడుకోనీ! యలరి పాడుకోనీరా!

రంగు రంగులతోడ
రమణీయ మూర్తిగా!
అందచందాలతో
నలరింపనీవోయి!

నా కంటి జ్యోతివని
నా ప్రాణ జీవమని!
నిను పూల పూజించి
నీతోడ బలుకనీ!

దారి లేని నన్ను దరిజేర్పుమని వేడి
ఎన్నెన్నొ గీతముల విన్నపము జేయనీ!
వేయి తీగెల వీణ విడువకను మ్రోగనీ!
తీయ తేనియ పాట తీరుగా విరియనీ!

## మందారం విరిసింది!

మందారం విరిసింది!
మావికొమ్మ పూచింది!
నా మదిలో నవగీతిక
నవమాధురి తొలికింది!
మందారం విరిసింది!
మావికొమ్మ పూచింది!

కొండ కోనలందు దిరుగు
కోకిల తీయని పాటగ!
నా గళమున సనసన్నగ
నాట్యమాడి వెడలింది!

సన్నజాజి పూపొదలా!
జాబిలి తెలి వెన్నెలగా!
నీ చరణము లందుకొనగ
నిలిచింది చిన్ని కృష్ణ!

దీపములా నిన్ను జూచు
దీనమైన నా గీతిని
కన్నతల్లి యొడిజేరే
కసికందుగ జేర్చుకొనుము!

నీ మురళిని గలిపికొని
నిండు దయను జూపవోయి!
కోటిదీప కాంతులలో
కూరిమితో గలిపికొనుము!

## మది తొడిగిన చివురాకులు

మది తొడిగిన చివురాకులు
మనసునందు వాడుచుండె!
పూచిన పూవొక్కటియును
పూర! స్వీకరింపవుగా!
మది తొడిగిన చివురాకులు
మనసునందు వాడుచుండె!

విరిసిన నా హృదయ వీణ
వేయి గీతముల బాడితి!
ఒకటి కూడ నాలకించి
యోర చూపు జూడవుగా!

మినుకు మనెడి రిక్కలాగు
మీరిన వెతలను గుందుచు!
కరుణ జూపుమనుచు వేడు
కొంటెను దయ జూడవుగా!

కాపుననుచు బ్రోవుమనుచు
కరుణతోడ జూడు మనుచు!
ఎన్ని దినము లిటుల నేను
సన్నుతింతు పరమాత్మా!
కమ్మని నా గీతి వినుచు
గావ వేమి కారణమో!
దయజూడుము చరణదాసి!
దారుణ విరహము బాయగ!

## పచ్చ పచ్చని వన వీధుల నే

పచ్చ పచ్చని వన వీధుల నే
పాల పిట్టలా యెగరాలీ !
తీయని మురళీ రవముల వింటూ
తేనె లొలుకుతూ పాడాలీ!
పచ్చ పచ్చని వన వీధుల నే
పాల పిట్టలా యెగరాలీ!

కాలిగజ్జియలు ఘల్లున మ్రోవగ
కలకలమని నే పాట పాడగా!
సెలయేటిని గల పిల్ల తరగలూ!
బిల బిల మనుమా దొరలాలీ!

నింగి మబ్బులను హంస బారులూ!
నేల తల్లిపై తుమ్మెద గుంపులు!
నా వెను వెంటనె యాడుతు పాడుతు
నవనాట్యము లే చేయాలీ!

నీ తీయని మురళీ స్వనములతో
నా తీయని మది గీతము గలియగ!
ఆనందార్ణవ సుధల దేలగా
ఆశల విరులే పూయాలీ!

కోయిల పాడుతు తీపిపాటలను
గోరింకలు లయ తాళ గతులతో!
చిలుక కన్నియలు చిత్రగతులతో
చిఱు మబ్బులవలె తరలాలీ!

# కనుల ముందు కానిపించు

కనులముందు కానిపించు
కరుణామయా! గానలేక!
దూర దూరమందు గనుచు
"రార!" యనుచు బిలుచుచుందు!
కనులముందు కానిపించు
కరుణామయా! కానలేక!

మనసుపొందు వెతలనన్ని
మర్మముగా లేఖ వ్రాసి!
మేఘమాల కందింతును
మేరలేని వినతులతో!

పవలు రాత్రి నిదురలేక
పరితపించు చుందును మది!
మదిలోపల మురళినూదు
మాధవ! నిను గన నేరను!

జ్యోతి జ్యోతి గలుపుకొనుము!
ప్రీతి మదిని నిలిపి కొనుము!
మాయ తెరను తొలగింపుము!
మాధవ! నీదే భారము!

ఆత్మార్పణమనుచు బలికి
అంజలి ఘటియించితినీ!
అతివను మది జేర్చుకొనుము!
అలత కలత తొలగిపోవ!

## వేయి దీపాలతో

వేయి దీపాలతో వేడుకను వెలసితివి!
రెండు కన్నుల నెటుల నిండార జూతురా!

దివియంత భువియంత
దిశలన్ని వ్యాపించి!
అలరియుండే నిన్ను
అర్థింతు నెటులరా!

వేయి దీపాలతో వేడుకను వెలసితివి!
రెండు కన్నుల నెటుల నిండార జూతురా!

కోటి తారకలలో
కొలువు తీరిన నిన్ను!
ఏ తారకను జూతు
నింపుగా మది నిలిపి!

అన్ని రూపాలతో
అలరియుండే నిన్ను
ఈ రూపమే యనుచు
ఇంపుగా బలుకుదును?

అందుకే కృష్ణ! యని యపురూపముగ మదిని
మధుర మురళిని యిచ్చి మమత నిటు బెంచితిని!
మనసు బాధను మాన్పి మరి నీలో గలిపికొను!
వెలుగులో వెలుగనై వేడుకను జెందనీ!

## కన్నులార గాంచనీర

కన్నులార! గాంచనీర
కలతదీర నీ రూపము!

మఱల యడుగకుండ క్షణమ!
మమత దీర శాంతి నీర!

కన్నులార గాంచనీర!
కలతదీర శాంతి నీర!

మధుర మురళి యూయలలో
మనసు పొంగ నూగనిమ్ము!
దివ్య చరణ సన్నిధిలో
దీపములా వెలుగనిమ్ము!

బంగారపు పల్లకిపై
బరువుగ నను జేసుకొనుము!
నిర్మలముగ నిను జూచుచు
నీరధిలో బిందు వౌదు!

కోటి సూర్య కాంతులతో
కొలువుదీరి యున్న నీకు!
అంజలి నే ఘటియించి
ఆత్మార్పణ నేయనిమ్ము!

నీ ప్రేమామృత ధారల
నిండుగ నను దేలనిమ్ము!
శ్రుతి లయల నిబద్ధమైన
సుందరమున గలిపి కొనుము!

# స్వర్ణారుణ కాంతులలో

స్వర్ణారుణ కాంతులలో
సరస రుచిర వనవీధిని

నన్నొక మొలకను జేయుము!
నాథ! నేను వికసింతును!

స్వర్ణారుణ కాంతులలో
సరసరుచిర వనవీధిని!

సన్నజాజి తీవెయందు
సరసముగా నొక పూవుగ!
మధుర పరిమళముల జింది
మాధుర్యము నొలకబోతు!

సప్తవర్ణ సరసను నే
సౌందర్యములను జిందుచు!
ముద్దబంతి పూల మొలక
మురిపెములను విరజిమ్మెదు!

సియనంత భూతకోటి
నేనొక యణువును మాత్రము!
మనసులోని కోర్కె యేదొ
మాధవ నీ కది తెలియును!
కలవరమును తొలగజేసి
కాంతి శాంతి దయసేయుము!

## జాడ తెలిసి యరుదెంచితి

జాడ తెలిసి యరుదెంచితి!
నీడ తెలిసి కనుగొంటిని!
కనికరింపవలె నోయీ!
కాదు, కూడదనకు స్వామి!
జాడ తెలిసి యరుదెంచితి!
నీడ తెలిసి కనుగొంటిని!

అలల తెరల దాటుకొనుచు
అశ్రువులను నీదుకొనుచు
నిన్ను జేరుకొంటి స్వామి!
నీరజాక్ష! వందనమూ!

మబ్బు తెరల ద్రోసికొనుచు
మాయజేసి తారకలను!
నీ ఛాయల బొడగంటిని!
నీ పదముల జేరుకొంటి !

నీ మురళీ స్వనములచే!
నీదు విమల రవళులచే!
ఏ మూలను నొదిగియున్న
ఎచటనున్న గనుగొందును!

నీ మురళీ మధుర ధ్వనులు
నీ జాడలు తెలియ జేయు!
నీ పాటలె నా కవితలు!
నీ విరహమె నా యూపిరి!

## మనసునందు నీ రూపము

మనసునందు నీ రూపము
మరల మరల జూచుచుందు!
భావశూన్య హృదయముతో
బరగుచుందు నేనో!
మనసు నందు నీ రూపము
మరల మరల జూచుచుందు!

కనుల నున్న నీ రూపము
కాంతుల ప్రసరించు నెపుడు!
జగతి చిత్రగతులన్నియు
ఛాయలుగా భావింతును!

మధుర మురళి స్వనము నెపుడు
మాధవ! వినిపించుచుండు!
మఱి లోకవ్యాపారము విన
మనసు రాదు! మనసు పోదు!

పక్షి వోలె పంజరమున
బందీగా నుంటి నెన్నినాళ్ళో!
కలత దీర్చి గారవమున
కామితమును దీర్పవోయి!

మనసు పొందు కోరిక నిక
మానవోయి! జేరదీసి!
తర తరాల జీవయాత్ర
తరగిపోవ తునిగిపోవ!

## క్రొన్నెల కాంతులను జిందు

క్రొన్నెల కాంతులను జిందు
వెన్నెల మొలకలను జేర్చి!
చిన్ని తారకల మాలను
చిన్నికృష్ణ! యర్పించితి.
క్రొన్నెల కాంతులను జిందు
వెన్నెల మొలకలను జేర్చి!

తొలి సంధ్యల కాంతులతో
మలి సంధ్యల రేఖలతో!
కుదురుగ ఈ కంఠమాల
గూర్చితి కద! చిన్నికృష్ణ!
చిలుక పలుకు పదములతో
చెలి కోకిల రాగములను!
తీర్చి దిద్ది నా గీతము
తీరుగ వినిపించితి గద!

నా భావము నా రాగము
నాథ! నీకు దెలుపవలెనా?
మనసు నందు దిరుగులాడు
మాధవ! గమనింపలేవ?

యుగ యుగాల దీ రాగము!
తరతరాల దీ భావము!
విరహ వేదనలను దీర్చి
విమలకాంతి రేఖ నేర్పు!

## మబ్బులలో చందమామ

మబ్బులలో చందమామ!
మణిగి తొంగి చూచునటుల!
నా మదిలో నవగీతిక
నాట్యమటుల నేయుచుండు!
మబ్బులలో చందమామ
మణిగి తొంగిచూచు నటుల!

పిల్లగాలి తెరల యందు
మెల్లగ కదిలీ కదలక!
కలువ కన్నె సొగసులవలె
కదులుచుండు మధురగీతి!

తనకు తానె పాడుకునే
తరుణి ప్రేమ గీతివలె!
తనకు తాను పాడుకొనును!
విలపించును తనలోనే!

ఎన్నాళ్ళిటు విరహగీతి
కన్నీళ్ళను తొలుకవలెనో?
తీయని మురళీ రవళిని
తీపి తెరల దేలవలెనో?

ఆనందము పొంగిపొరల
ఆత్మవిభూ! చేర్చుకొనుము!
కర్మబంధములను దొలచి
కరుణింపుము స్వామి! నన్ను!

## కంటినీరా కదిలి పొమ్మా!

(ముత్యాలసరం)

కంటినీరా కదిలిపొమ్మా!
కలకలంబని ధ్వనులు చేయుచు!
విభుని పాదము లంటు వఱకును
వేయి విధముల బాడుమా!

తామరాకున నీటి బిందువు
తరుణ కాంతులు జిమ్మునట్టుల
పూలరేకలపైని నిలిచీ
పూర్ణ పురుషుని బాడుమా!

నింగితారల జేరుకొనుమా!
నీలిరాత్రి తుషారమును వలె!
ధరణిపై బడి కాసికిన వలె
తల్లడిల్లును విభునికై!

యుగయుగాలా పాట బాడుచు
జగ జగాలా కదిలిపోవుచు!
విరహగీతము బాడుకొనుచూ!
వేయి స్వరములు మీటుచున్!

భక్తితో పరవశము జెందీ!
'బాంధవిని' యని విన్నవింపుము!
జన్మ జన్మల విరహ గీతము
మర్మముగ వినిపింపుమా!

## తీయని మురళీ యెందులకూ?

తీయని మురళీ యెందులకూ? నీ
తేనియ రాగా లెందులకూ? కృష్ణ!
    మనసును దోచుకు రానీయని నీ
    మధుర స్నేహమది యెందులకూ?
తీయని మురళీ యెందులకూ? నీ
తేనియ రాగా లెందులకూ?

అందెలు కదలగ నాట్యమాడి నే
ఎంగాలకోయీ కిన్నెర మీటుట?
రాత్రిం బవళులు రమ్మని పిలుచుచు
రవ రవ లాడుట యెందులకూ?

కంటి కగపడక కమ్మని మురళిని
గానము చేయుట యెందులకూ?
కథగా మిగిలిన మన స్నేహ మదీ
వ్యథగా మిగులుట యెందులకూ?

ఆకురాలు కాలములో నా వ్యధ
అంతమగుట యది యెందులకూ?
మల్లెల వసంతము వచ్చినంతనే
మతి భ్రమించుటది యెందులకూ?

నల్ల రాతిలో నున్న నీకు నా
మర్మ వేదనలు యెటు దెలియూ?
వెలుగు రేఖలను వెలుగు రేఖనై
వెలయగ నీ దయ కురిపింపూ!

## కల కలంబని రవలు సేయకు

(ముత్యాల సరం)

కల కలంబని రవలు సేయకు!
కదలి మ్రోతగ ధ్వనులు సేయకు!
కంటినీరా! కదిలి పొమ్మా!
చంటి పాపల నడకలన్!

మిట్ట పల్లములందు బొరలుచు
మెల్ల మెల్లన సాగిపోయెడి!
సన్నని సెలయేటి జాలున
సాగుమా హరికీర్తనన్!

క్షణము నిలిచీ సుడులు తిరుగుము!
తన్మయముతో నాట్యమాడుము!
మధుర మంజుల రవము సేయుము
మాధవుని యనురక్తితో

మలయ పవనము వీచు నటులను
మాలతీలత కదులునటులగ
సాగిపొమ్మా! స్వామి గలియగ
సాధుగీతము పాడుచున్!

స్వామి చరణము లందు బొరలి!
స్వామి దీవన లంది పొందీ!
పాలకడలిని కలిసి పొమ్మా!
పరమ సుఖమును బొందగన్!

## అందమైనా పదము లెన్నక

(ముకార్యాల వరం)

అందమైనా పదము లెన్నక
సుందరంబగు పాటలల్లీ!
భక్తి పాడితిగాద! స్వామీ!
పాలకడలీ ప్రమోతలన్!

మంజులంబగు భావములతో
మాలతీలను తీగెయట్టుల
విన్న వించితి గాద స్వామీ!
పే విధంబుల కీర్తనల్!

విమలమగు నీ రూపులెన్నో!
వేరు విధముల చరితలెన్నో!
గోడలన్ని వ్రాసితిని గద!
కూర్మితో నవరంగులన్

రాతి రాతిని బొమ్మ జేసితి
రమ్యమగు నీ రూపములతో!
నాథ! యింకను దయలు రావా!
నవ్యశోభలు చిందగన్!

రంగవల్లులు దిద్దినట్టి
రమ్యమగు నా హృదయమందున!
అడుగు పెట్టీ యార్తి బాపి
హత్తుకొనుమా! కరుణతోన్!

## కన్నీటి ధార లివే! కలిసి ప్రవహించెరా!

కన్నీటి ధారలివే! కలిసి ప్రవహించెరా!
సెలయేటి పాటగా వెందినది కృష్ణా!

కల కలా స్వనములివే! కల్లోల నాదములు
వినిపింపవా నీకు వేణుగోపాలా!

కన్నీటి ధారలివే! కలిసి ప్రవహించెరా!
సెలయేటి పాటగా వెందినది కృష్ణా!

రాస క్రీడలయందు రవ రవల నుంటివో!
నీ మురళి స్వనములను నిండార మునిగితో!
నా యేటి పాటలను నా కేల గీతలను
మన్నింప వెందుకో! మాధవా! ఒకసారి!

మిట్ట పల్లములన్న యెటు లెటులో గమియించి
నీ పాద సన్నిధిని నిలువగా గోరినది!
కన్నీటి జాలులో కథను వినిపించికొని
మన్నింపు మొకతూరి మమత దీరును నాకు!

కొండలన్ని దాటి, కోనలన్ని జరిగి
కోకిలల జతగూడి కొసరిపాడినది!
చిలుకలా పలికేటి చిన్ని యలలా రొదను!
వినిపించుకోవయ్యా వేణుగోపాలా!

కన్నీటి ధారలివే! కలిసి ప్రవహించినది
సెలయేటి జాలుగా వెందినది కృష్ణా!

## ప్రభుని మందిర మల్లె దే!

(ముత్యాల సరం)

ప్రభుని మందిర మల్లె దే! నీ
విభుని గోపుర మల్లె దే! కను!
కంటివీ నా! యాగిపొమ్మా!
వింటివా! శుభ నాదముల్!

కమ్మగా కలహంస లెన్నో
కావ్య గానము సేయుచున్నవి!
కోకిలమ్మలు పాడుచున్నవి
కూరిమిని హరికీ ర్తనల్!

రంగు రంగుల దీపములతో
రమ్యమగు హరివింటి శోభను!
కడిమి తరువుల చాటు నదిగో!
గాంచవే! హరిద్వారమున్!

మందిరపు ప్రాంగణము నందున
మధుర భావము లోక జేయుము!
తీయనీ నీ తీపి కలయిక
తీరునే విభు కలయికన్!

యుగయుగాలా మధుర వేదన
జగజగాలా విరహ గీతిని!
పదము లంటీ వినతి సేయుము
భక్తి తోడుత స్వామికిన్!

## రాబోకురా కృష్ణ! రమ్యమగు రూపాన

రాబోకురా కృష్ణ! రమ్యమగు రూపాన!
విరులు లేని తీగ విధముగా నుంటిరా!

నీకోఆకు మధనపడి నీరసించితినోయి!
తీర్చుకోనీ సొగసు తీరుగా ముచ్చటగ!

రాబోకురా! కృష్ణ! రమ్యమగు రూపాన!
విరులులేని తీగ విధముగా నుంటిరా!

బొట్టు నుదుటను లేదు! పాలువుగా గాటుకలు
కంటి నీటి తెరలు కలిసి ప్రవహించినవి!
అలకలన్నీ కలిసి యంటినవి జడలుగా!
మాసినా వలువలను మాతిరోటుల నిను జూతు!

స్నానమాడితినెవుడో! సరిగ గురుతులు లేవు!
అన్నపానీయములు నారగించుట లేదు!
తీయనీ నిను రేవుడు తీరుగా గాంచితినో!
యుద్ధమును జూచి నా యందాలు గంటినో!

నిను వేడి వేదనల
నిను బాడి శోకమున!
విడియు జాబిలికి వలె
వింతగా మారితిని!

అవుడె రాబోకురా అందాల నా స్వామి!
వన్నెలను గూర్చుకొని వగలుబోనీ క్షణము!

## తెరచాపలేని యీ తేలిపోయేపడవ

తెరచాపలేని యీ తేలిపోయే పడవ
గమ్యమును చేర్పగా గతి నీవె! పరమాత్మ!
మర్త్యాని కేగే యీ సుడులు తిరిగే నావ!
అద్దరిని చేర్పగా ఆత్మబంధువు నీవె!

ఉవ్వెత్తు టలలలో
ఉసురుసుర మంటోంది!
సుడులలో తిరుగుతూ
సోలిపోతూ వుంది!

తెరచాపలేని యీ తేలిపోయే పడవ
గమ్యమును చేర్పగా గతినీవె! పరమాత్మ!

పెనుగాలులకు కదలి
పేదవడి పోతోంది!
ఆటుపోటులలోన
ఆరాట పడుతోంది!

తెరచాపలేని యీ తేలిపోయే పడవ
గమ్యమును చేర్పగా గతినీవె! పరమాత్మ!

తిరుగా నా పడవ
తీరమును చేరగా !
నావికుడవై కృష్ణ!
నావ నడిపింపరా!

తెరచాపలేని యీ తేలిపోయే పడవ
గమ్యమును చేర్పగా గతినీవె! పరమాత్మ!

# పున్నమి వెన్నెలకు వోలె

పున్నమి వెన్నెలకు వోలె
పూలు పఱచితోయి కృష్ణ!
పదము మోపి చరణ దాసి
ప్రార్థన విను! దయను దలచి!
పున్నమి వెన్నెలకు వోలె
పూలు పఱచితోయి కృష్ణ!

కొండ కోనలన్ని వెదకి
కోటి పూలు సమకూర్చితి!
ఒక్క పూవు చేతనంది
మొసగరాద! కోర్కె దీరదా!

వికసించిన కలువను వలె
విప్పారిన పద్మములా!
ఎదురు మోమునుంటి స్వామి!
మనసు తొలుచు వేదనతో!

కిన్నెర మీటుచు పాడే
కీర్తనొకటి వినరాదా?
కాంక్షయేమొ కీర్తన విని
కనికరించి యీరాదా!

నా పాటకు తుది లేదూ!
నా తంబుర యాగిపోదు!
నీ సుందర దర్శనమును
నే గని తరియించు వఱకు!

## కన్నీటి జాలులో

కన్నీటి జాలులో కదులుచున్నవి శిలలు!
వెన్నెలల సొగసులవి వికవికలు నగుచుండ!
మనసు చెదిరినదోయి! మాధవా! వే రమ్ము!
కమ్మనీ నా మనసు కడలి పొంగాయెరా!
కన్నీటి జాలులో కదులుచున్నవి శిలలు!
వెన్నెలల సొగసులవి వికవికలు నగుచుండ!

కలకలా ప్రవహించు
కన్నీటి జాలులను!
సృష్టి చిత్రములన్ని
చూడ లేకున్నాను!
వేదనల ముసుగులో విమలమగు నీ రూపు
అలలలో కదిలేటి యపురూప చిత్రమగు!

కలువ దామర లన్ని
కదులు చున్నవి యెటకో!
తుమ్మెదల బారులవి
తోరణము గట్టగా!
నీటి పక్షులు గూడ నిలువ లేకున్నవీ!
ఎగసిత పడేటి కదులు మీనములును!

ఉన్మత్తునా లేచి యుప్పొంగు కన్నీరు
నీ పాదములు గడుగ నిశ్చయము తెలియదా!
మన్నించవు నా మనవి! నన్నుగా! పిల్లగా!
చిన్నారి పాపగా జేర్చుకొను నీ యందు!

## దివి భువి యంతటికి

దివిభువి యంతటికి దీప్తినిచ్చే స్వామి!
నా మనసులో నుండి నను నిన్ను జేర్చుకొను!

తీయనీ వెన్నెలను తీరయిన మార్గాన
దివ్య సోపానాల దిశను నను నడిపించు

దివిభువి యంతకూ దీప్తినిచ్చే స్వామి!
నా మనసులోనుండి నను నిన్ను జేర్చుకొను!

మావి పూలకు వోలె మదినిండి పోవాలి
కుహూ కుహూరవమునను కోకిలలు పాడాలి!
మధుర గీతములతో మాధుర్యమును జింది
నీ మురళి స్వనములను నిటుగా గలియాలి!

సంధ్య కాంతుల వోలె నరసతను నే బొంది
రమణీయ భావాల రమ్యతను బొందాలి!
సురుచిరంబయిన నీ సుందరంబులు నాలో
లయ తాళ గతులతో నర్తనలు చేయాలి!

నా మనసు రంగమై
నా మనసు గీతమై
ఆనంద హర్షములు
అంతటా నిండాలి!

అరుణ కాంతులయందు అంబరము నగురుతూ
బంగారు పిట్టనై పరవశము జెందాలి!

## 'విపాడిన కతవికు వలె

కవి పాడిన కవితకు వలె
కమ్మని గీతమును నైతి!
రాగ తాళలయ ధ్వానాలను
రమ్య సుధల చిందుచుంటి
కవిపాడిన కవితకు వలె
కమ్మని గీతమును నైతి!

చిత్రకారు డందముగా
చేర్చి కూర్చి నవరంగులు!
అపురూపుగ తీర్చిదిద్ది
యతివవోలె నేనైతిని!

కొండలలో కోనలలో
కూర్చిన నవ శిల్పములా
మారని తీగను బిలిచెడి
మోదవతిగ నే మారితి!

నాట్యమునై గీతమునై!
నవరంగుల చిత్రమునై!
ఎన్ని రూపముల నందిన
'చిన్ని మాట' మాటాడవు!

నన్ను మదిని చేర్చుకొనవు!
నగుచుందువు దూరముగా
[illegible]

# తరులు గిరులు కొలకులన్ని

తరులు గిరులు కొలకులన్ని
దాటి విష్ణు పూజ కొఱకు!
తుమ్మెద వలె బాదు కొనుచు
తూలిపోవుచుంటి చెలియా!
తరులు గిరులు కొలకు లన్ని
దాటి విష్ణు పూజ కొఱకు!

కొండ కోనలను గమించి
కోయిల కుహూ కుహూల దాటి!
మావి దోవులన్ని దాటి
మాధవు దివ్యార్చనలకు!

గిరి గుహాలను గండశిలల
తెరలి తాకి ధరణి దూకు!
దివ్యనదీ సోనలాగు
దీక్షబూని పోవుచుంటి!

తూరుపు పడమరకు జరుగు
తోరవు తెలి తారకగా!
అల్లి బిల్లి తిరుగుచు నే
నడలుచుంటి విభుని కొఱకు!

ఆత్మశాంతి లేదు నాకు
ఆత్మ విభుని గలియు వఱకు!
విశ్వ పమాలింపు వఱకు
విరహా మతులె బొందుచుందు!

నీ నా పరిచయభాగ్యము!
నీదు నాదు మధుర స్నేహ!
యేనాటిదో తెలుపవలెనా?
ఈ నాటిది కాదు స్వామి!
నీ నా పరిచయ భాగ్యము!
నీదు నాదు మధుర స్నేహ!

కనిపించని నిను గుఱించి
గారవ మెందులకో!
కంట జూచు వారి కంటె
కలవరపడు టెందులకో!

తల్లిదండ్రులు, స్నేహితులూ
తగ బాంధవు లెందఱున్న!
నీవే ప్రియబాంధవుడవు!
నీవే నా సర్వస్వము!

మాట మంతి లేక ఇటుల
మౌనముద్ర తెలనయ్యా?
చిన్న మాట మాటాడవు!
చిఱునగవును చిందింపవు!

మనసు నందు నిలిచియుండి
మఱువకు నను అంతే చాలు!
భక్తి రక్తి కలుగజేసి
బాంధవ్యము నిలుపు కృష్ణ!

## తొలి సంధ్యలకు ముందు

తొలి సంధ్యలకు ముందు తొలికోడి కూతలా
నాథ! నీ యర్చనకు నను మేలుకొలుపుమా
ఆలయమ్మున నీదు చక్కనౌ మూర్తిని
కనులార దర్శించి కదలిపోదును క్షణము!
తొలి సంధ్యలకు ముందు తొలికోడి కూతలా
నాథ! నీ యర్చనకు నను మేలుకొలుపుమా!

మనసులో నుండి నను
'మాధవా!' యనిపింపు
పుష్ప గుచ్ఛములతో
పూజించనీ నిన్ను!

మనసులో నూగెట్టి
మధురమగు భావాల!
పొదిగి పూమాలగా
పూర్ణ యర్పించనీ!

జన్మ జన్మల స్నేహ
మర్మముల దెల్పనీ!
విరహ గీతములతో
వీవనలు విసరనీ!
అంజలిని ఘటియించి
యాత్మ నర్పించనీ!
తొలిసంధ్యలకు ముందు తొలికోడి కూతలా
నాథ! నీ యర్చనకు నను మేలుకొలుపుమా!

## ఇన్ని పాటలను

ఇన్ని పాటలను మదీ యెటుల పాడినదీ?
ఇన్ని భావముల యెద యెటుల నొలికినదీ?

చిన్ని నా మనసులో చిట్టి గోపాలుడూ!
చిందిరా నాట్యాలె చిటిపొట్టి గీతాలు!

ఇన్ని పాటలను మది యెటుల పాడినదీ?
ఇన్ని భావముల యెద యెటుల నొలికినదీ?

చిలుక గోరింకలను చిత్రముగ పలికించెది!
చందమామను జేరి జగడాలు చేసింది!
తారలను జపించి తరగని ముచ్చటలు!
సంధ్య కాంతుల జేరి తొలికెంపు లొలికింది!

మల్లెమాలతులతో మర్మాలు దెలిపింది!
కోకిల భామలతోడ కలకలా నవ్వింది!
కొలనులన్ని మునిగి కోనలలు దర్శించి
కొండ కోనల దాటి కోనవటుకు చూచింది!

ఎన్నెన్నొ గీతాలు ఎన్నెన్నొ భావాలు
చిన్ని నా మనసెటుల దెలుప గలిగినదీ?
చిన్ని కృష్ణుడు మదిని చిఱునగవు జిందగా
కన్నె మనసెటులుండు కలవరము పడకుండ!

ఇన్ని పాటలను మది యెటుల పాడినదీ?
ఇన్ని భావముల యెద యెటుల నొలికినదీ!

## హేమంతపు పొగమంచును

హేమంతపు పొగమంచును
హిమబిందువులను గనుగొన!
నా విషాద మంత యిటుల
నలుగడ వ్యాపించె నేమొ!
హేమంతపు పొగమంచులు
హిమబిందువులను గనుగొన!

చంద్రకాంతి తెలుపులాయె!
తెలిమబ్బుల గుబురులాయె!
రెల్లుపూల పరువులతో
రెపరెపలను ధరణి నిండె!

తెలుపలేక పలుకలేక
తేజమంత మాయమాయె
కలువలవలె కొలనులందు
గాంచుచుంటి క్రీ సెవల!

విరహముతో నే విషాద
వేదనలో పొరలుచుంటి!
కన్నీటిని తుడువరాద!
కనికరించి గోపాలా!

ఆత్మనాత్మ గలిపికొని
ఆనందము నీయరాద!
జ్యోతి జ్యోతి గలుపుకొని
ప్రీతి శాంతి నీరాదా!

### అందెలు ఘలు ఘల్లు మనగ

అందెలు ఘలు ఘల్లుమనగ
అలరి నాట్య మాడలేను!
తీయని గీతమును బాడి
తీరుగ మెప్పింపలేను!
అందెలు ఘలు ఘల్లుమనగ
అలరి నాట్య మాడలేను!

కంటినీరు కడవలుగా
కదులు చుండె తెరలి తెరలి!
గోదవలను పొగులు చుంటి
వేదనలను గోపాలా!

చిలుకవలె పలికిన యా
చిత్రగతులు మాసిపోయె!
నెమలివలె నాట్యమాడ
నేర్పులన్ని తరిగిపోయె.

రెక్క విరిగి నేల పడిన
పక్షిలాగు నేనుంటిని!
రక్ష నీవె యని బలుకుచు
రా రమ్మని పిలుచుచుంటి!

ఆదరించి కనికరించు
ఆత్మీయుడ వీవేగా!
కనికరించి శిరముపై
కరము నుంచి దీవింపుము!

## చిగురాకు వంటిదగు

చిగురాకు వంటిదగు చిన్ని నా మనసులో
నీ వుండగా గదా! నేర్చితని కొంతంత!

కొండకోనలు తిరిగి
కోటి సరసులు మునిగి
భూమి యాకాశాల
పొలుపులను జూచితిని!

చిగురాకు వంటిదగు చిన్ని నా మనసులో
నీ వుండగా గదా! నేర్చితిని కొంతంత!

సంధ్య కెంపులలోని చక్కదనముల గంటి!
హరివిల్లులో నున్న యందాల గనుగొంటి!
చంద్రబింబములోని జాలులను దెలిసితిని!
తారకలలోని యా తళుకులను జూచితిని!

ఆఱుఋతువులలోని యందాల లీనమై
కవి మనసులో నుండు కాంక్షలను దెలిసితిని!
పాట పద్యాలలో ప్రతిమలను జూచితిని!
శిథిల శిల్పాలలో చిరువేదనల గంటి!

బొమ్మలను జేసేటి కుమ్మరివి గోపాల!
నా బొమ్మలో నుండి నాట్యాలు జేసేవు!
అన్ని చూపించేవు! అన్ని చేయించేవు!
చివరికే మగుదునో! చిత్రమగు ఆటలో!

## కలసి పోనీ నీదు

కలిసి పోనీ! నీదు కమ్మనీ సొగసులను
నిలిచిపోనీ! నీదు నీడలను కృష్ణా!

హరివిల్లులో నొక్క యణువునై పోనిమ్మ!
జలబిందువుగ మారి జలధిలో కలువనీ!

కలిసిపోనీ! నీదు కమ్మనీ సొగసులను
నిలిచిపోనీ నీదు నీడలను కృష్ణా!

దీపకాంతిని తొలుకు
తీయని శిఖనై
అలరి మటు మాయమై
యంతటా కలువనీ!

కలువుకొను నిలువుకొను
కమ్మనీ రాగాల!
విరహగీతములోని
వేదనను మాన్పుమా!

కర్మ బంధము బాపి
కరుణతో కాపాడ
జన్మ జన్మల స్నేహ
జాలులో పయనింప

కన్నీటి పువ్వులను కానుకగా నిచ్చితిని!
మంగళంబని పాడి మధుర గీతములతో



## స్వాగతమో! విశ్వ విభూ!

స్వాగతమో విశ్వ విభూ!
స్వాగతమో జగదీశ్వర!
స్వాగతమిదె! విశ్వజనక!
స్వాగతమిదె! పరమేశ్వర!
స్వాగతమో ! విశ్వ విభూ !
స్వాగతమో! జగదీశ్వర!

జీవకోటి కంతటికీ
చైతన్యము నీవేగా!
పాలన పోషణ జేసీ
ఉలరించే వాడ వీవె!

కంటి కొలకులందు దొలుకు
కన్నీటిని తొలగ జేసి!
విమల శాంతి సమపూర్ణము
విశ్వజనుల కందఱికీ!

సుఖశాంతుల చిగురువేసి
సుందరముల పూలు పూచి!
మానవతా మాధుర్యము
మాలోపల గలుగజేయి!

మది పూచిన పూవు లివే
మనసు కోరు కాంక్ష లివే!
అడుగుమోపి పు మిపైని

నీ నా పరిచయభాగ్యము!
నీదు నాదు మధుర స్నేహ!
మేనాటిదో తెలుపవలెనా?
ఈ నాటిది కాదు స్వామి!
నీ నా పరిచయ భాగ్యము!
నీదు నాదు మధుర స్నేహ!

కనిపించని నిను గురించి
గౌరవ మెందులకో!
కంట జూచు వారి కంటె
కలవరపడు టెందులకో!

తలిదండ్రులు, స్నేహితులూ
తగ బాంధవు లెందఱున్న!
నీవే ప్రియబాంధవుడవు!
నీవే నా సర్వము!

మాట మంతి లేక యిటుల
మౌనముద్ర లేలనయ్యా?
చిన్న మాట మాటాడవు!
చిఱునగవును చిందింపవు!

మనసు నందు నిలిచియుండి
మఱువకు నను అంతే చాలు!
భక్తి రక్తి గలుగజేసి
బాంధవ్యము నిలుపు కృష్ణ!

# ఇతర సాహితీ గ్రంథములు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రంథాలయ సంస్థవారి అనుమతిని పొందబడినవి. అన్నిపుస్తకములకు సై లేషన్ నెంబర్లుగలవు.

| | | | |
|---|---|---|---|
| 1. | విజయ మంగళమ్ (గీతములు) | 4 | 00 |
| 2. | ఆనంద మంగళమ్ (గీతములు) | 4 | 00 |
| 4. | అంతటికి వచ్చిన కోడలు (నాటిక) | 2 | 00 |
| 5 | ఉత్తర గోగ్రహణము (నాటిక) | 4 | 00 |
| 6. | నాట్యశాల (నాటిక) | 4 | 00 |
| 7. | సరోజినీదేవి - శ్రీ కందుకూరి (బుర్రకథలు) | 2 | 00 |
| 8. | భూమితల్లి బిడ్డలు (నాటిక) | 2 | 50 |
| 10. | వినయాంజలి (భక్తి వచనములు) | 4 | 00 |
| 11. | వీధి దీపం (వచన గేయ కవితలు) | 4 | 00 |
| 12. | పాలేటి తరగల్లో మల్లి (పాటలు) | 5 | 00 |
| 13 | శ్రీ రామచంద్రసుధ (కీర్తనలు) | 4 | 00 |
| 14 | వీరనారి ఝాన్సీలక్ష్మీబాయి (బుర్రకథ) | 5 | 00 |
| 15. | కృష్ణదాసి (గేయములు) | 4 | 00 |
| 16. | ప్రణయకథ (గేయములు) | 4 | 00 |
| 17. | శోణ పద్మం (నాటిక) | 3 | 00 |
| 18. | సాయిదాసి (సాయి పాటలు) | 2 | 00 |
| 19. | [illegible] - పువ్వులు (గేయములు) | 4 | 00 |
| 20. | శ్రీ అల్లూరి సీతారామరాజు (బుర్రకథ) | 3 | 00 |
| 21. | ప్రతిధ్వనులు (వచన గేయ కవితలు) | 4 | 00 |
| 22. | శ్రీ గోదాదేవి పాటలు | 2 | 00 |
| 23. | శ్రీ గిరిజాకళ్యాణము (మంజరీద్విపదగీతములు) | 10 | 00 |
| 24. | ఎఱ్ఱన - పోతనల కవితా మాధుర్యములు | 10 | 00 |
| 25. | మానసగీతాలు (ఆత్మీయము) | 4 | 00 |